# బాల వ్యాకరణం

## సంధి పరిచ్ఛేదం

### ఆమ్రేడిత సంధి – విభక్త్యాగమాలు

ఉపన్యాసకుడు

డా.రామక పాండురంగ శర్మ

# ఆమ్రేడితం – (ద్విరుక్తటకారం) సంధి

40. ఆమ్రేడితంబు పరం బగునపుడు కడాదులం దొలియచ్చు మీఁది వర్ణంబుల కెల్ల నదంతం బగుద్విరుక్త టకారం బగు.

ఈ సూత్రమునకు భృశార్థంబుందు ద్విరుక్తి విషయం బని యెఱుంగునది.

కడ + కడ = కట్టకడ; ఎదురు + ఎదురు = ఎట్టయెదురు ...
కడ, ఎదురు, చివర, తుద, తెన్ను, తెరువు, నడుమ, పగలు, పిడుగు, బయలు, మొదలు ఇత్యాదులు కడాదులు.

# ఆమ్రేడితం – (విభక్తి లోపం) సంధి

41. ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు.

అప్పటికిన్ + అప్పటికిన్= అప్పటప్పటికిన్,అప్పటి కప్పటికిన్

అక్కడన్ + అక్కడన్ అక్కడక్కడన్, అక్కడ నక్కడన్

ఇంటన్ + ఇంటన్ = ఇంటింటన్, ఇంటనింటన్

ఊరన్ + ఊరన్ = ఊరూరన్, ఊరనూరన్

# ఆమ్రేడితం – (అంత్య లోపం) సంధి

ఇంచుక  నాడిత్యాదులందు బహుళ గ్రహణముచేత నంతిమాక్షర లోపంబునగు

ఇంచుక + ఇంచుక = ఇంచించుక, ఇంచుకించుక

నాఁడు + నాఁడు = నానాఁడు, నాఁడు  నాఁడు

# పూర్వప్రయోగాలు

42. అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

అందదుకు - ఇఱ్ఱింకులు - ఇల్లిగ్గులు - చెల్లచెదురు - చెల్లాచెదురు. తుత్తుమురు - తుత్తునియలు - మిఱుమిట్లు ఇత్యాదు లెఱుంగునది.

# విభక్త్యాగమం - ఇత్వం

43. చేత,తోడ,వలనల కిత్వంబు సమాసంబులం దగు.

నీ చేతన్ + ప్రోవు = నీచేతిప్రోవు,

నాతోడన్ + చెలిమి= నాతోడిచెలిమి

నీవలనన్ + భయము= నీవలనిభయము.

# అలిగాగమం

44. అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు.

నాయందున్ + కరుణ = నాయందలికరుణ
ఇందున్ + జనులు = ఇందలిజనులు
ఎందున్ + వారు = ఎందలివారు
ఎందు శబ్దమున కలిగాగమంబు కొందఱు లే దండ్రు.

# ఆమ్రేడితం పరమైతే

## ద్విరుక్త టకారం

* కడ + కడ = కట్టకడ
* ఎదురు + ఎదురు = ఎట్టయెదురు

## లోపం

* ఇంటన్ + ఇంటన్ = ఇంటింటన్, ఇంటనింటన్
* నాఁడు + నాఁడు = నానాఁడు, నాఁడు నాఁడు

## పూర్వ ప్రయోగం

* చెదురు+చెదురు =చెల్లచెదురు,చెల్లాచెదురు

# విభక్త్యాగమాలు

## ఇత్వం

* నీ చేతన్ + ప్రోవు = నీచేతిప్రోవు
* నీవలనన్ + భయము= నీవలనిభయము

## అలిగాగమం

* నాయందున్ + కరుణ = నాయందలికరుణ
* ఎందున్ + వారు = ఎందలివారు

